





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# బాల శతకము





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014792

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Author's Last Name

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# బాలశతకము



[కాపీరైటు] గ్రంథకర్త: [రిజిష్టర్డు

కొణిదెన వేంకటనారాయణ.

# విజ్ఞప్తి.

ఆర్యులారా!

గ్రంథరచనకు నాకిది ప్రథమాభ్యాసము? వ్రాయుటకుఁగల కారణమునుబట్టి నేను నుత్సాహము గాని నాకుఁగల భాషావైదుష్యము గాదు. బాలురనేర్చుకొనఁదగిన నీతులను బాలురకు సుబోధకము లగునట్లుగా వ్రాసిన బాగుగనుండునని తలంచి ఈబాలశతకమును వ్రాసితిని. ఇందు నాయభిప్రాయ మెంతవరకు సమకూరినదో దీనిఁ జదివిన నాసోదరులేచెప్పగలరు.

భాషాపాండిత్యము లేమిచేతను, రచనకుఁ బ్రథమ ప్రయత్నమిదియగుటను, నీబాలశతకమునందు చాలలోపము లుండవచ్చును. పాఠకోత్తములు తెల్పిన సవరించుకొందును. ఈశతకమును [illegible]ంచి నాకుసాయమొనర్చిన నాయుపాధ్యాయపూజ్యులు శ్రీమాన్ దీవి రంగాచార్యులవారికి నా కృతజ్ఞతాపూర్వకవందనముల సమర్పించుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,
కొణిదెన వేంకటనారాయణ,
ప్రాథమికపాఠశాలోపాధ్యాయుఁడు.

## —* కృతిసమర్పణము. *—

ఉ॥ ఏయమ భర్తయానతికి నించుకయుం గడవదాట కుండునో
యేయమ శాంతి,దాంతి,శుచి,శీల్యగుణంబుల బేరుఁబొందెనో
యేయమ నొచ్చియుం బరుల నీయమటుల్గనుమ వేడఁబోవదో
యాయమకుఁ గాల్మ్రొక్కి బాలశతకాంకితమిచ్చెద లక్ష్మమాంబకున్,

శ్రీ

# బాలశతకము.

గీ॥ శ్రీలఁ జెన్నొందు శ్రీహరిఁ జిత్తవీథి
భక్తితోఁ బూజసేసియుఁ బ్రస్తుతించి
సిద్ధకవిపుంగవుల నెల్ల నెంతుమదిని
లలితపదములతో నీతులొలుక బాల॥ ౧

గీ॥ శ్రీయు నారోగ్యసంపద స్థిరయశంబు
నాయు గ్రంథముల్ విద్యయు న్యాయబుద్ధి
నిచ్చు; నీచిన్నిపొత్తంబు నీవుపట్టి
చిన్ననాఁటనె చదువుచు నున్నబాల॥ ౨

గీ॥ పుట్టితివి నీవు పుడమిపైఁ బూర్వపుణ్య
ఫలమువలనను మనుజ సంభవుడవగుచు
నింక నీవుండు పద్ధతు లేర్పడంగఁ
దెల్పెదను జేటమాటలఁ దెలియు బాల॥ ౩

గీ॥ తల్లిదండ్రుల నీయిష్టదైవములను
విద్యనేర్పిన గురులను బెద్దవారిఁ
దగిన చెలికాండ్ర సేవింపనగును నీకుఁ
జెందెదవు దానశుభములు చిన్నిబాల॥ ౪

గీ॥ శాంతగుణ మొకండుగల్గిన సద్గుణములు
వేయుగల్గినయట్ల; దిపాయు నెడల
సకలశృంగారములతోను బాలు తాళి
లేనిస్త్రీవలెనగు దానిఁ బూను బాల॥ ౫

గీ॥ ఎవరికిని నిన్నుఁజూచిన నింపుబుట్టు
నటుల వినయంబుతో నుండ నౌనుజుమ్ము
యెవ్వరేమేమి చెప్పిన నవ్వసేయ
కాత్మఁదలపోసి చేయుటయగును బాల॥ ౬

గీ॥ పరులనిందింపఁ బూనకు; పొరుగువారి
కలిమిఁ జూచిననేడ్వకు; చలముచేత
వట్టితిప్పలేరికైనఁ గట్టఁబోకు;
పాపకార్యంబులివ్వి సేయవలదు బాల॥ ౭

గీ॥ కాలమెప్పుడు నేరిత్తకర్జములనో,
గడపుకొనఁదాన శ్రేయంబు గలుగఁబోవ
దింటిపనులనో, విద్యనో, యంటియున్న
మేలు; బుద్ధికి మాంద్యతతూలు; బాల॥ ౮

గీ॥ మంచిగొనములఁ జనువులఁ మించియున్న
వారిననుకరింపుము నీవుకోరినట్లు
చిలిపి బాలురఁజూచినఁ బలుకఁ
నైనవలవదు తలవంచి యరుగు బాల॥ ౯

గీ॥ పసిఁడియిచ్చిన కమసాలికసటుమాపి
వన్నెనిడి తెచ్చియిచ్చిన పగిదినొజ్జ

బుద్ధిపద్యలచే నిన్నుఁ బ్రోదిచేసి
నిచ్చుఁదలిదండ్రులకు మేలు హెచ్చు బాల॥ ౧౦

గీ॥ సాయ మెవ్వరుఁ గోరిన శక్తికొలఁది
సాయ మొనరింపు మదినీకు సాయపడను
కష్టకాలంబులోఁ జింతకలుగకుండఁ
గూర్మి చెలికానిఁ బోలె నిక్కముగను బాల॥ ౧౧

గీ॥ భూమిపై జంతువులనెల్లఁ బ్రేమఁ జూచు
పరిభవింపంగ నోర్చదని బాలురకును
చిలిపితగవుల దుష్టులఁ గలసి తేకు
మూర్ఖవాదముల్ గావింపఁ బోకు బాల॥ ౧౨

గీ॥ కల్లలాడకు మెప్పుకుఁ గోరి కార్య
ములను జేయకు నీకెంత కలిమియున్న
గర్వపడఁబోకు పేదలఁ గరుణఁ జూపు
మంచిపద్ధతియిది మదినుంచు బాల॥ ౧౩

గీ॥ అలవిమీరిన పనులకు సాహసింపఁదగదు
పిలువకుండఁగ బడికెప్పు డెడలవలయు
నెల్లవేళల సంతోషముల్లమందుఁ
బాయకుండిన సుఖములు ప్రబలు బాల॥ ౧౪

గీ॥ త్రాగకుమెప్డు కాఫి, మద్యంబులెల్లఁ
దినకుమా మాంసమంగటితిండ్లు మరిగి
నిల్పకుమ స్త్రీలపై భ్రాంతి స్వల్పమైన
నాడకుమ చీట్లు, పందెము లఘము బాల॥ ౧౫

గీ॥ మంచిగాలిని బీల్చుట, మంచినీరుఁ
ద్రావుచుండుట, శుచియైన స్థలమునందుఁ
గాపురంబుంట, సాధారి పక్వాన్నములను
గుడుచుచుండుట, రోగములుడుగు బాల॥ ౧౬

గీ॥ పలక, బలపము, పొత్తముల్, వస్త్రములను,
శుభ్రముగనుంచి వేకువఁ జారఁగలేచి
దైవమునుగొల్చి కాలకృత్యములఁదీర్చి
స్నానమాడియు బడికిఁ బోఁదగును బాల॥ ౧౭

గీ॥ భాగ్యములను దేహారోగ్యభాగ్యమే సు
భాగ్యము;ల నేరికేనది పదిలపడదొ
వాఁడె నిర్భాగ్యుఁడగు సిరిఁగూడనున్న
వానిననరాదు దానిని విడయు బాల॥ ౧౮

గీ॥ మంచివాఁడవు నీవని మాయఁజేసి
కొంటెపిల్లలు నిన్నది కోరిరేని
తల్లిదండ్రుల నడుగక తస్కరించి
తేకు; మది పెద్దతనమని తెలియు బాల॥ ౧౯

గీ॥ గురువు పాఠములను జెప్పఁ గూరుచుండి
చక్కగావిని చెప్పఁగా సంతసించు
శిక్షసేయండు విద్యయు సత్వరముగ
వృద్ధియగుఁ గల్గుఁ జ్ఞాపకశక్తి బాల॥ ౨౦

గీ॥ భూషణంబులకెల్ల సుభూషణంబు
విద్యయేసుమీ; యెవ్వఁడు విద్యలేమి

బుడమిశోభింపడౌటను జడతమాన్పు
విద్యధరియింపు ; భూమేలు విడచిబాల॥ ౨౧

గీ॥ చిన్నతనమున పనులను జేయుమనుచుఁ
దల్లిదండ్రులు చదివింపఁ దలఁచుకున్న
నీవె మెట్టులో చదువుగా నేర్పు తోడ
బికిరమెత్తెడి పిల్లలశిక్షముబాల॥ ౨౨

గీ॥ భాను బింబంబు చేతను బంకజంబు
వికసనముఁ జెందు కైవడి విద్యచేత
బుద్ధివికసించు ; సంపదల్బొదలు ; శీల
మార్గమలవడు ; దీనినేమరకు బాల ॥ ౨౩

గీ॥ కుందనమునకు నెలిగారమందినట్లు
బాల్యమున విద్యలెస్సగాఁ బట్టువడును
గాన పరువైన సమయంబు గాలిఁబోవఁ
జేయకెప్పుడుఁ జదువుమ చిడక బాల॥ ౨౪

గీ॥ కుదురుగాఁ దరగతి నీవుకూరుచుండి
ప్రక్కవారితో మాటలాడక్క యొజ్జ
యేదిసేయుంగ నియమించు నాదరమునఁ
జేయు మది; నీకు శ్రేయమౌనోయిబాల॥ ౨౫

గీ॥ బాలురందఱకంటెను మేలువాఁడ
వగునటుల నీవుచురుకుగా నరుగఁదగును
జేనఁజొచ్చిన వెనుకఁజఁబూనవలెఁ
పరువున మేలుబంతివై నెగడుబాల ॥ ౨౬

గీ॥ చదువునప్పుడు, దేవుని ముదముతోడ
భక్తిఁ బూజించునప్పుడు, వలయుపనులు
చేయునప్పుడు, భయమును, సిగ్గు వలదు
చెడుపనులుచేయు నెడ నుంపఁ జెడవు బాల॥ ౨౬

గీ॥ భాగ్యమును జూడఁ గన్నులపండువైన
రూపమును జూచి యెవరునీ దాపుఁ జేరి
ముద్దులాడంగ వత్తురే! ముద్దు గొలె
చదువు సద్గుణము లుండి బ్రదుక బాల॥ ౨౭

గీ॥ గురువు శిక్షను దప్పించుకొనుట కొఱకు
నప్పుడప్పుడ వల్లించి యొప్పఁ జెప్పి
మఱుదినంబున లేకుండు మాయ చదువు
వలవదే వేళనుఁడగా వలయు బాల॥ ౨౮

గీ॥ తల్లిదండ్రుల మఱపించి తరలివెంటనో
యాటలాడుచు నిప్పుడు గూటదీప
ముంచిన నిలుసేరక యెప్డొ యొదిగియొదిగి
చేరి చదువక యుండకు మోరి బాల॥ ౩౦

గీ॥ నీళ్ళ, నిప్పుల, ముండ్లుల, రాళ్ళ, నీతు
నాడఁబనిగాదు కీడగునయ్య యెందు
చెట్లు గుట్టలు గోడలు గట్ల నెక్క
జనకు పడినను చిదుకొను తనువు బాల॥ ౩౧

గీ॥ గొప్పకులమునఁ బుట్టితి నొప్పుఁగుఱ్ఱ
రూపమొందెనటంచుఁ గురూపులైన

మనుజులను హీనకులులను గనిన నగకు
చేతనగునంత ధర్మముఁ జేయు బాల ॥ ౩౨

గీ॥ ధార్మికుని సిరి యెల్లను ధర్మమునకుఁ
జేరునట్టుల వంశనిక్షేపమైన
బాలుఁడే వేళ బుధజనప్రాయుఁడగుచు
నుపకరించును బ్రదుకు సత్కృపను బాల ॥ ౩౩

గీ॥ పెక్కువృక్షంబులను నొక్కచిక్కు పరిమ
ళముల వెదజల్లు మలయజద్రుమము మాడ్కి
వెలయు నొకఁడైన సుగుణము లలరియున్న
బాలకుఁడు పిల్లలకు మధ్య బడిని బాల ॥ ౩౪

గీ॥ ఎన్ని విఘ్నము లేనిమై పన్నియున్నఁ
జేతఁబట్టినపని పూర్తిచేసిగాని
విడువనను గట్టినియమంబు పెట్టుకొనుము
దానఁ బనులన్ని సఫలములౌను బాల ॥ ౩౫

గీ॥ దీర్ఘకోపంబు మనమున దీటుకొలిపి
యెరినైనను సాధింపఁ గోరరాదు;
ఎంత యవమానపడియును సుంతయైనఁ
జింత సేయక యుండు మోచించి బాల ॥ ౩౬

గీ॥ కఠినముగ మాటలాడిన గౌరవంబు
పోవుటేగాక తగవులు పుట్టుఁగాన
వలదు; ప్రియముగ నెప్పుడుఁ బలుకు మెందు
దానఁ బ్రేమ జనించు నందఱకు బాల ॥ ౩౭

గీ॥ ఎట్టిపగవారికైన నీకొప్పుమగాని
కీడుఁగోరకు కల్గిన వేఁడువలకు
నుండకేగియు వేగిర మండయుగుచు
కడవఁ బెట్టఁగ నాపదల్ గడగిబాల॥ ౩౮

గీ॥ తల్లిదండ్రుల గారవమెల్లఁ దొలఁగ
నేనునట చూచినది తెచ్చియిమ్మనుచును
తల్లిదండ్రుల యాజ్ఞలనెల్ల నెపుడు
చేయుచూ! శిరసావహించియును బాల॥ ౩౯

గీ॥ కుడుచుటయుఁ ద్రావుటయు నిద్రఁగొనుట చేయు
పనులు చదువులు వ్యవహార వర్తనములు
క్రమముదప్పక నడుపుమీ! కానియెడల
వ్యాధులలమును సంకటపడుదు బాల॥ ౪౦

గీ॥ శుచిగ నొకచోట స్థిమితముఁ జూచినిలచి
విశ్వరక్షకుఁడైన గోవిందునామ
ముక్తకంఠమైన స్మరియింప నోపుదేని
సర్వశుభములు పొందెదు సతముబాల॥ ౪౧

గీ॥ అతఁడుచేసినఁ జేయుదుననుచు నెపుడు
నొకరితో వంతునకుఁ గూరుచుండరాదు
చేయవలసిన పనులను న్యాయముగను
విధియనుచుఁ జేయుమెపుడైన విడక బాల॥ ౪౨

గీ॥ చేయఁగానిది నేవని చేతగాక
పరిహసింపంగఁ బోమొదీ పాపమేమొ?

ఎన్ని నేర్చినఁ జేసిన సేవలెపనులు
గనినఁ బొగడుట మంచిదిగదర బాల॥ ౪౩

గీ॥ తినక పెట్టక మూటల ముణిఁగితేలు
కృపణుని ధనంబులట్లుల నుపశమించుఁ
దిరిగి చదువక యుక్తులకుఁ గఱపఁబోక
మదిని బదిలంబు చేసిన చదువు బాల॥ ౪౪

గీ॥ చదువు నేర్చుట బుద్ధిని జక్కఁ బఱచు
కొనుటకుంగాని దుష్టులఁగూడి యెపుడుఁ
గుట్రలను బన్ని కొంపలు గూల్చగాదు
వలదనిన వీడకుండ నెవ్వరికి బాల॥ ౪౫

గీ॥ బలముగలవాడనంచు దుర్బలురి టన్నఁ
గర్ర మొనరింపఁ గాల్దువ్వఁ ఘనముగాదు
నిన్ను నొప్పించువాఁడైన నీబలంబు
వ్యర్థమగుగాదె! బీరముల్ వలదు బాల॥ ౪౬

గీ॥ బడికిఁ బోనొల్లక గురుండు బాగుగాను
జదువుఁ జెప్పిన దినమెందు వెదకి లేదు;
ఏలపోవలె బడికి? నే నేమిచదువ?
ననుచుఁ బోషించువారితో ననకు బాల॥ ౪౭

గీ॥ ఎఱుఁగ రెవ్వరు నాకిది తరుణమంచుఁ
బోకు పాపము లొనరింప నో కుమార!
నీవు మనుజుల కనుఁగప్పనేర్తువేని
దైవముండదె సత్యము దలఁప బాల॥ ౪౮

గీ॥ మాటలను నేర్చి యెవరైన మాటలాడ
వినువుగొను రీతి నేమము ప్రేలఁదగదు
యుక్తయుక్తము గా ననుగిక్తి కలుగ
మితముగాఁ బల్కఁదగును యోగ్యతగ బాల॥ ౪౯

గీ॥ గురువు కోపించునని లోనగొణఁగికొనుచు
నడుగుమాటకుఁ బ్రతిఁజెప్ప కుడుగరాదు
తడవు సేయక ఘంటాపథంబుగాను
ప్రశ్నలకుఁ జెప్పతగినజవాబు బాల॥ ౫౦

గీ॥ చెప్పినది మోసమయ్యెను చెయ్యవలెన్నఁ
జెప్పఁబూనకు సాగిన ముప్పతిల్ల
చెప్పకుండిన దాననే ముప్పలైనఁ
గలుగునెడ వెంటనే జెప్పవలయు బాల॥ ౫౧

గీ॥ పాఠముల నొక్కరోజైన వదలకుండ
పట్టుదలతోడఁ జదివిన వచ్చువిద్య
లేనిచో నేండ్లు పోయినఁ గానిరాదు
బడికి సెలవంచు లోకలుగదు సుమ బాల॥ ౫౨

గీ॥ వస్తుబడియున్న వస్తువును బట్టఁబోకు
వ్యయము సేయకు ద్రవ్యంబు వ్యర్థముగను
కూడబెట్టు మార్గమునందు కొంతయైన
ధర్మమును సేయుటొక కొంతతగును బాల॥ ౫౩

గీ॥ చెడినపనులను దలచుక చిత్తమందు
తీవ్రముగఁ జర్చ సేయుచు దిగులుపడుట

గీ॥ పుష్పమును వాడఁజేయకే పుష్పరసము
ద్రావు మధుపంబుకైవడిఁ దా నెవరిని
నలయఁజేయక గుణవిద్య లమరునట్లు
పాటుపడు మంచిబాలుఁడు బడిని బాల॥ ౬౦

గీ॥ ఎవరిఁజూచిన భయభక్తు లెఱుగకుండ
నెపముకై నడి దెబ్బలకిచ్చి వీఁపు
దుడుకుఁదనముఁ జేయుచు నసిచుపాపఁ
డెను మొరకాఁగాక ; కుఱ్ఱఁడే? యెన్న బాల॥ ౬౧

గీ॥ ఎట్టివిద్యలభ్యాసముం బట్టియుండుఁ
గాన వీసకు ప్రాణాంతమైనదాఁక
దేన సాధనసల్పెదో దాన నీకుఁ
గొంగు బంగారమగుచుండుఁ గూడి బాల॥ ౬౨

గీ॥ అదరిపాటేమిలేకుండ నందఱయెడ
నొక్కటే సోదరన్యాయముున్నవాని
దైవమెప్పుడు దీవించుఁ దనకుఁబోలి
యుండునట్లుగ ; నారీతి యుండు బాల॥ ౬౩

గీ॥ సంద్రమునఁజేరి చెడియెడు జలములట్లు
దుష్టులనుగూడఁ జెడుదువు ; దుగ్ధములను
నీరు చేర మేలైనట్లు నీతిపరుల,
నెయ్యమొనరించి బుధుడవై నెగడు బాల॥ ౬౪

గీ॥ ధన కుల, సురూప ములకును ఘనుడవైన
గౌరవము, కీర్తి, సంస్తుతుల్, గలుగఁబోవు ;

ధర్మమును న్యాయమును బుద్ధిఁదగిలె నేని
కలుగు నీ కెల్ల శ్రేయము; లలితబాల ౧౫

గీ॥ కూడుగుడ్డకుఁ బేదయు, గురు వినీతి
నధికతోడఁ సమంబుగ నలరుచుండుఁ;
దలఁగు నేనీతి, వాఁడు సంతాపతప్త
దేహుఁడౌ బుద్ధి సంపద దెగుట బాల ౧౬

గీ॥ నీకెవరు చెప్పి చెడుపని నెఱపుమన్న
మాటవిని చేయఁబోకు మోమాటముంచి
తగినపనియైనఁ బదుగురు దలఁపకున్న
మానె; యొనరింపుమీ! యది పూని బాల ౧౭

గీ॥ గురువు నిన్నెప్డు కోపించి కొట్టెనేని
మనసులోనైనఁ దిట్టుటమాని యతఁడు
సాయమే మేనిఁగోరిన సలిపి గురుని
ఋణము నీఁగుట యొప్పిన గుణము బాల ౧౮

గీ॥ పెద్దబండను దలమీఁద పెట్టియున్న
మోయుదే? కూలిపడి నలిగిపోదుగాక
యీడెఱుంగక యింతంత లేసి పొత్త
ములను జదువ మెదడు చెడిపోవు బాల ౧౯

గీ॥ మొలకమంటిది రోజులకొలఁదిఁ బెరిగి
పెరిగి వికసించి పెద్దదై వెలయుఁగాదె?
విద్యలన్నింట నొకనాఁడె పెద్దఁజేయు
మన్న నెట్లయ్య? క్రమముగా నగుదు బాల ౨౦

గీ॥ తనకుఁ దానెద్దియును దీర్పఁదగినశక్తి
యేపనులు నంతలో సేయనెఱుఁగుబుద్ధి
కౌశలంబును, నూహయు, గలుగునట్లు
చదువు మెప్పుడు; వల్లెలు వదలిబాల॥ ౭౧
గీ॥ చెఱచి యితరుల తామును జెడెదు నరులఁ
వేదముల వర్ణముల దూరి వాదులాడ
వినకు చెవియిచ్చి నీకది పెంపుగాదు
చెడుదు నీపూర్వధర్మము చెఱచిబాల। ౭౨
గీ॥ ఆచరించి ధర్మములెల్ల నఖిలమునకుఁ
గర్తలై ధర్మపథమును గదలకుండ
ధర్మములు బోధచేసిరి దయఁదలిర్పఁ
బూర్వికులువాని సలుపంగఁ బోలుబాల। ౭౩
గీ॥ రిక్తగాఁ గూరుచుండియు భుక్తి కొఱకుఁ
జేయు యోచన లేమిట శ్రేయమౌను?
పనులయందున శక్తితోఁ బాటుపడుచు
బ్రతుకఁదగవగు నప్డుయోగ్యతగబాల। ౭౪
గీ॥ భూతహితవుగ నేకార్యములనునైనఁ
జేయుశుభదంబె కాకున్న కీడుఁదెచ్చు;
తనకెయాయుష్య మారోగ్యమని దలంచి
క్రూరమును నల్పబోవుమార్గునకుబాల। ౭౫
గీ॥ దైవమును నమ్మితాఁబ్రయత్నంబు నలుప
నెట్టికార్యంబులైన గట్టెక్కుచుండు;

లేనిచో నన్ని విఫలంబులౌను గృషియు
వర్షమును లేని సస్యంబువగది బాల! ౨౬

గీ॥ ఏల ? సంపాదనకుఁగాని మేలిగౌనము
లబ్బుటకుఁగాని చాలని యట్టిచదువు;
రెండుగల్గియు నిహపరముండునట్టి
చదువుఁ జదువంగ సంతోషమొదవు బాల! ౨౭

గీ॥ పొత్తముల నక్షరపు రూపమునను నిలుచు
భారతీదేవి; కావునఁ బ్రబలమైన
భక్తి నిత్యము పాఠముల్ పఠనఁజేయు
నపుడు దలఁచిన విద్యలు నమరు బాల! ౨౮

గీ॥ వ్రాతబల్లలు, పటములు, పలకబలప
ములు, సిరాబుడ్లు, కాగితములు, కలములు,
అంబ - వాణి - వసింపగా నమరునిండ్లు
కాన వానిని భక్తితోఁ గనుము బాల! ౨౯

గీ॥ దేశభాషను, గణితము, దేశధర్మ
ములను, ముఖ్యంబుగా నేర్వవలయు మొదట;
పిదపఁదన కులోచితమైన వృత్తిఁబూని
భుక్తికై పాటుబడుటది పోలు బాల! ౩౦

గీ॥ చాల పొత్తములెల్లను జదివికొనుచు
శుద్ధమగు భాష నేర్వంగఁ జూడుమయ్య;
వ్యర్థమగుభాష నేర్వకు పలుకఁ బోకు
తనువు కష్టంబెగాయది తలుపబాల! ౩౧

॥ ధర్మసంగర మొనరింప ధర్మపరుల
చరితలను నేర్చివారల సద్గుణములు
నిన్నుఁబొందంగ నడువుమీ! నియతినట్లు;
పేరుగల్గిన బ్రతుకునుగోరి బాల॥ ౯౨

॥ మోదుజివ్వురింప, గింజలు మొలకలెత్త,
రాలుకరుగంగఁ బక్షులు వ్రాలమీఁద,
గానకళ నేర్తువా! నీవఘనుడవగుదు;
వెల్లరును నీకెనశులౌదు రెఱుగు బాల॥ ౯౩

॥ చిత్తరువు బాగుగా వ్రాయఁజేతనైన
దేవతా రూపములను జిత్రించిచూపి
మనుజులకు భక్తిఁ గలిగించి మనుపవచ్చు;
న్యాయపద్ధతి ద్రవ్యమునబ్బు బాల॥ ౯౪

॥ చేతిపనులు సేద్యంబును జేయువిధము,
బాగుగా నేర్చికొనుమ నీ బాగుఁ దెరువె;
స్వేచ్ఛగా జీవనంబును జేయవచ్చు;
గౌరవముతోడ బ్రదుకొనుగా దె బాల॥ ౯౫

॥ చిన్ననాఁటఁ బ్రహ్లాదుండు శ్రీహరీ! జ
గన్నియామక! నను బ్రోవఁ గంబమందుఁ
బొడమవే యనఁబుట్టి మేల్పొదలఁజేసెఁ;
గాననాహరిభక్తిచే గాంచు బాల॥ ౯౬

॥ నారదాదులరీతిగాఁ గోరినీవు
కృష్ణ!, గోవింద!, కేశవా!, విష్ణు రార!

ఘనుచు హరినామములను గీర్తనము జేసి
పాపములనెల్లఁ బాపఁగావలయు బాల॥ ౮౭

గీ॥ చిఱుతనాఁడె శ్రీకృష్ణుండు పెఱుఁగువాఁడు
తల్లిదండ్రుల బాధలు తలఁగఁద్రోసి
ప్రజలనందఱ రక్షించె పరమకృపను
చిన్నవాఁడైన గుణమునఁ బెద్ద బాల॥ ౮౮

గీ॥ మనుజులందున ఘనుఁడెప్డు కనఁబడండు;
యొదిగియుండును; నీచుఁడు మొదరఁ బోక
యాడుచుండును లేచి పుల్లాకువోలెఁ,
గాన ఘనునిట్లు కనిపెట్టి కాంచు బాల॥ ౮౯

గీ॥ న్యాయపథమును దప్పక నడచునరుఁడు
పేరుబొందఁగఁ గానిది పెట్టుకొనఁడు
విహిత కార్యములను జేసి వెలయుచుండుఁ
బ్రజలకెగ్గులు సలుపఁ డొల్పధిక బాల॥ ౯౦

గీ॥ అక్కఱను బట్టి యాచారమొక్కరణిని
బుధులు మెత్తురు? కైకొనఁ బోలదెందు
ధర్మమారసి నడువఁగా తగును సత్య
వాక్కునెపు తాఁటఁ గట్టంగఁబడుచు బాల॥ ౯౧

గీ॥ నిన్ను శిక్షించువారు లేకున్న, నున్న
నీకు నీవె సాక్షిగనుండి నేర్పుతోడ
నీతిమార్గముపేక్షింప నేరవలయుఁ
జెప్పువారలు లేరని చెడకు బాల॥ ౯౨

గీ॥ జంతువులు, శకుంతములు, వృక్షములు, నదులు
సంద్రములు, పర్వతంబులు, జలధరములు
ధర్మమును దప్పి మెలఁగవీ ధరను కంటె!
వానివలె నీవునుండగావలదె బాల॥ ౯౩

గీ॥ కాసు, వీసము పోలని ఘనలు కొంద
ఱన్నిటను తామె యధికులమంచు నెగడి
ప్రజలచే సెప్పు చీవాట్లు పడుచునుంద్రు
వలవదట్టుల, నీశక్తి మెలఁగు బాల? ౯౪

గీ॥ చిత్ర మీశ్వరసృష్టి; విచిత్రమౌను
దానికంటెను కులముల గిగవులాట;
ఱంతకధికంబు చదివియు సంబనైన
స్వకులధర్మంబునైనఁ, జేవదల బాల॥ ౯౫

గీ॥ నూరుమాటలు క్రియమాని నుడువుకంటె
నొక్కటైనను గ్రియఁజూప నొప్పునెందు
నూరునీతులు నేర్చి నీపూరకుండు
కంటె నొకటైనసల్పుట ఘనము బాల॥ ౯౬

గీ॥ మల్లెపూఁదాకవలె మంచిపిల్లలెపుడు
నిట్టినీతులునేరిచి యెల్లకడలఁ
బొగడఁబడుచుంద్రు నూవె యాభువిని దేట
వెన్నెలలను మించెడు కీర్తి వెలుఁగ బాల॥ ౯౭

గీ॥ మనలకధికారులై మేలుగనఁగఁ జేయు
నధికవిద్యాప్రవరులు విద్యాధికారు
లకుఁ బ్రజాప్రభుత్వపు సభ్యులకును నెపుడు
జయముగలుగ దేవుని వేడఁజనుము బాల॥ ౯౮

గీ॥ మనల కాపదలను బాపి మనుచునట్టి
వాను దేవున కెప్పుడు దోసిలొగ్గి
భక్తిఁ బ్రార్థించి జయజయధ్వను లెసంగ
మంగళారతులను నిచ్చి మనుము బాల॥ ౯౯

గీ॥ పావనంబైన శౌణిదెన వంశజుండు
నతుడు వేంకటనారాయణాఖ్యుఁ డెలమి
బాల గీతాళిసీతులు జాలనించి
శతకమునుఁ జెప్పెఁ బాలురు చదువ బాల॥ ౧౦౦

